# చందమామ

పిల్లల కథల మాసపత్రిక

CHANDAMAMA : CHILDREN'S STORY MONTHLY



1ST OCT. 1948

6 AS



*Chandamama, October 1948*

*Photo by: B. Ranganadham*

బొమ్మల కొలువు

జూపిటర్ వారి

# అభిమన్యు

## ఆంధ్ర దేశమందంతటా
## మహత్తరమైన విడుదల
## 25-9-'48 నుండి

యీ మీ అభిమాన చిత్ర ప్రదర్శన శాలలలో



విజయవాడ — శ్రీరామా
రాజమండ్రి — మినర్వా
కాకినాడ — ప్యాలస్
విశాఖపట్టణం — పూర్ణా
విజయనగరం — పూర్ణా
గుంటూరు — న్యూ సిటీ
నెల్లూరు — శ్రీ వినాయక
మచిలీపట్నం — సరస్వతి
తెనాలి — స్వరాజ్
ఏలూరు — పాండురంగా
బరంపురం — జ్యోతి



పూర్ణా రిలీస్

| | | | | | |
|---|---|---|---|---|---|
| అమలాపురం | — | పరమేశ్వర | నంద్యాల | — | నేషనల్ |
| గుడివాడ | — | శ్రీనివాస | ఆదోని | — | వి.యన్. పిక్చర్ ప్యాలస్ |
| చీరాల | — | గోపాలకృష్ణా | హొసపేట | — | అజమ్ |
| కడప | — | సాయిబాబా | నగరి | — | శివశక్తి వెల్ |

చందమామ

ఈ సంచికలో యివి

చదువుకోండి



అవన్నీగాక చిక్కు చదరాలు, ముగ్గులు, చిక్కు బొమ్మలు, పాటలు, పజిలు, ఇంకా ఇంకా ఎన్నో వున్నై.

**చందమామ ఆఫీసు**
పోస్టుబాక్సు నెంబరు. 1686
మద్రాసు. 1.

ఆంధ్రదేశంలోని మీ అభిమాన థియేటరులో త్వరలో విడుదల

సిటాడల్ వారి

# జ్ఞానసౌందరి

(తమిళం)

నటీనటులు :

టి. ఆర్. మహాలింగం

యం. వి. రాజమ్మ

లలితా & పద్మిని

వి. జి. వెంకటేశన్

సి. యస్. శివభాగ్యం

మొదలైనవారు

★

దర్శకులు :

ఎఫ్. నాగూర్ & జోసఫ్

తలియత్ (జూనియర్)




ఆంధ్ర, దత్తమండలాలకి డిస్ట్రిబ్యూటర్లు :

వాహినీ పిక్చర్స్ లిమిటెడ్ :: మద్రాసు, విజయవాడ, తాడిపత్రి

# చలం

| | | |
|---|---|---|
| స్త్రీ | | 2- 0-0 |
| ప్రేమలేఖలు I | | 1-12-0 |
| ప్రేమలేఖలు II | | 1- 8-0 |
| బిడ్డలశిక్షణ | | 1- 8-0 |
| విషాదం | | 1- 0-0 |
| ఆనందం | | 1- 0-0 |
| చిత్రాంగి | [నాటకం] | 1- 8-0 |
| త్యాగం | .. | 1- 8-0 |
| మంగమ్మ | .. | 1- 0-0 |
| జయదేవ | .. | 1- 0-0 |
| శశాంక | .. | 1- 0-0 |
| సావిత్రి | .. | 0-12-0 |
| సత్యం. శివం. సుందరం | .. | 1- 4-0 |
| నాటికాగుచ్ఛం | | 1- 4-0 |
| కర్మమిట్లా కాలింది | [కథలు] | 1- 8-0 |
| కన్నీటికాలువ | .. | 0-12-0 |
| పాపం ! ! ! | .. | 0-12-0 |
| దైవమిచ్చిన భార్య | [నవల] | 1- 8-0 |
| మైదానం | .. | 1- 0-0 |
| అమీనా | .. | 1- 0-0 |
| వివాహం | .. | 1- 0-0 |
| బ్రాహ్మణీకం | .. | 0-12-0 |
| అరుణ | .. | 0-12-0 |
| హంపీకన్యలు | .. | 0-12-0 |
| అదృష్టం | | 1- 0-0 |
| వాళ్లు నలుగురూ | | 0-12-0 |
| అనాపీలర్ | [సౌరిస్] | 0-12-0 |




సంపుటి 3
సంచిక 4

సంచాలకుడు: చక్రపాణి

అక్టోబరు
1948

# హైదరాబాదు

మీరు హైదరాబాదు పేరు విన్నారు కదూ! దాన్నే మన వాళ్లు ఎగతాళికి 'ఆదరా బాదరా' అంటారు. దాని పరిపాలకుడు ఒక నవాబు. అతనికి చాల దురాశ. ఆయన అక్కడ వుండే హిందువులను హింసించటమేకాకుండా మనదేశాన్ని కూడా జయించాలని అనుకున్నాడు. పాపం! లేనిదానికి పోతే అతనికి ఉన్నది కూడా వూడిపోయింది. రేపటినించి హైదరాబాదును ఆ దేశపు ప్రజలే ఏలుకుంటారు. ఈ మాటు దసరా పండుగ మనమూ, హైదరాబాదు ప్రజలూ కలిసి సంతోషంగా చేసుకుందాము. ఏం? చక్కగా లేదూ!



# తాబేలు

కప్పర కప్పర చీకట్లో
కప్పలు గూసే కోనేట్లో
తాబే లొడ్డుకు చేరింది
తల తోకను గదలిస్తుంది.
ఆతట్టునకే నక్కొకటీ
పీతలు వెదకుచు వచ్చింది
ఏలా వాసన పట్టిందో?
ఎగిరి దానిపై దూకింది.

తల తోక ముడిచింది
తాబేటిమేటి
గుండ్రాతివలె కదల
కుండ పండింది.

ఇక నక్కపడ్డ పా
ట్లేమి చెప్పేది
తాబేటి చిప్పపై
తారసిల్లింది

సొంగపడ్డ దాక కొరకి
సొమ్మసిల్లెను;
పండ్లు సలుపు పుట్టి ఇట్లు
పలుకరించెను.

నక్క: "నలగవేమి టోయి నీవు
పలుగు రాతివా?
కొరకి కొరకి దవడపండ్లు
గుల్లలైనవి."

# నక్క

తాబేలు: "గాలి కాటి బిగిసివోయి
గడ్డ గట్టితి
నానబెట్టవోయి నీటి
లోనబావయా?"

నక్క: "పుండాకోర! మోసపుచ్చి
పోవ జూతువా?"

తాబేలు: "ముందుకాళ్ల వీపుమీద
మోపరాదయా?
ఇంతలోనె మోసగించి
ఎటకు బోదును?"

మంచి ఉపాయ మ్మనుకొని నక్కా
మాదిరిగానే చేసింది.

నక్క: కొంచె మ్మాగి"మ తేమి? నానితివ
గుజ్జు గుజ్జుగా లేదేమి?"

తాబేలు: "అంతానానితి బావా? నీకా
లానినచోటే మిగిలింది
కొంచెమునళ్లి మ్మ"నగానక్కా
కొసకా లటు గదలించింది.

చరచర తాబే లరిగింది
చురచుర నక్కటు చూచింది
రెపరెప ప్రొద్దటు పొడిచింది
తెపతెప కోనే రుబికింది.

నేరుపు కూరుపు లేని మలప లీ.
తీరుగ చెడిపోతు-టారు.

— ఏటుకూరి



# ప్రపంచదృష్టిలో మన దేశము



ఆశియాజ్యోతి
గౌతమ బుద్ధుడు



బౌద్ధమత ప్రచారకుడు
సామ్రాట్ అశోకుడు



సాహిత్య, శిల్ప, విజ్ఞాన పోషకుడు
మహారాజా విక్రమార్కుడు



సత్య అహింసా ప్రచారకుడు
మహాత్మా గాంధి




సీత వాళ్లమ్మతోనూ నాన్నతోనూ పొరుగూరు సంబరం చూడబోయింది. ఆ వూళ్లో ఆనాడు పెద్దజాతర జరుగుతుంది. వేలకువేలు జనం వస్తారు. రథం వూరేగుతుంది. భజనలవాళ్లు వస్తారు. ప్రభలు కట్టుకుని ఎద్దుల బళ్లమీద ప్రభలు వస్తాయి. ఎద్దుల కొమ్ములకు రంగులుపూసి మెడలలో చింగుచింగుమనే మువ్వల పట్టాలు కడతారు. ఆడవాళ్ళూ, మగవాళ్ళూ పిల్లలూ రంగురంగుల బట్టలు కట్టుకుని తిరణాల చూడవస్తారు. వీధులవెంబడి దుకాణాలు పరుస్తారు. అందమైన వస్తువులన్నీ అమ్ముతారు. అక్కడక్కడా తినుబండారాలుకూడా దొరుకుతాయి. పళ్ళూ, రబ్బరు బెలూనులూ, తూతూలూ, బొమ్మలూ అమ్ముతారు. రంగుల రాట్నా లుంటాయి. ఎంతో బాగుంటుంది.

సీత వాళ్ల అమ్మతో నాన్నతో యివన్నీ చూసింది. భజనలు విన్నది. రంగుల రాటం ఎక్కి గిరగిరా గిరగిరా తిరిగింది. సీతకు ఆకలివేస్తే వాళ్లమ్మ చక్కిలాలు కొనిపెట్టింది. జనం చాలామంది ఉండటంచేత సీత వాళ్లమ్మ వేలుపట్టుకుని విడవకుండా తిరిగింది.

పొద్దుకూకింది. కాని చీకటి పడలేదు. ఎందుకంటే దార్లపొడుగూతా దీపాలే. కాగడాలూ, ఇలాయిబుడ్లూ, గాసుదీపాలు కూడా పెట్టారు. అంతకంతకీ జనం ఎక్కువవుతున్నారు. సీత వాళ్లమ్మ చెయ్యి గట్టిగా పట్టుకుని సంబరాలన్నీ చూస్తున్నది. ఒకచోట సీతా వాళ్ల అమ్మా కాస్సేపు హరికథ విన్నారు. ఇంకోచోట తోలుబొమ్మలు చూశారు. మరొకచోట భజన విన్నారు.

శాంతసుందరి, మద్రాసు



సీత పాపం, చిన్నది కాబట్టి అలిసి పోయింది. ఆమెకు నిద్రవచ్చింది. అమ్మతో చెప్పింది. సీతను ఒకచోట పడుకోబెట్టి తల్లి పక్కనే కూర్చుంది. అంత సందడిలోకూడ హాయిగా సీత కన్నుమూసి నిద్రపోయింది. సీత నిద్రలేచేదాక పాపం, సీత తల్లికి సంబరం చూసేగీత లేదు. కాని, తల్లికి పిల్లకంటె ఎక్కువేమిటి ?

రెండుమూడు గంటలు గడిచింది. ఇంకా యిద్దరు ముగ్గురు అమ్మలక్కలు



పిల్లలతోసహా అక్కడికి చేరారు. ఇంతలో సీత తండ్రి అక్కడికివచ్చి, "దగ్గరలోనే బుర్రకథ చెబుతున్నారు; కాస్సేపు విని వద్దాం ర"మ్మన్నాడు.

"పిల్ల ఎట్లా ?" అన్నది సీత తల్లి.

"నీ పిల్లను మేం చూస్తాంలే, పోయిరా, అమ్మా," అన్నదొక మనిషి సీత తల్లితో.

మళ్లీ ఒక పావుగంటలో వచ్చేద్దామని సీత తల్లి వెళ్లిపోయింది.

అరగంట గడచింది. సీత పడుకున్న చోట చేరిన అమ్మలక్కలుకూడా కాస్త నడుమువాల్చి గురకపెట్టి నిద్రపోసాగారు.

మరి కాస్సేపటికి సీత లేచింది. తల్లి కోసం చూసింది. కనిపించలేదు. అంత దూరాన ఒకామె సీతకు తన తల్లిలాగే కని పించింది. సీత "అమ్మా" అని కేకేసి అక్క డికి వెళ్లింది. ఆ మనిషి జనంలో ఎటో మాయమయింది. జనాన్ని తోసుకుంటూ సీత కనపడ్డ ఆడవాళ్లందర్నీ చూడసాగింది. కొందర్ని చూసి తన తల్లే అనుకుని చెయ్యి కూడా పట్టుకుంది. కాని, వాళ్లెవ్వరూ తన తల్లికాదు.



ఎంతోమంది పట్టుచీరెలు కట్టుకున్న వాళ్ళూ, పచ్చని బంగారుఛాయగల వాళ్ళూ సీతకు కనిపించారు. కాని ఒక్క మొహంకూడా సీతకు ఆనందం ఇవ్వ లేదు.

తెల్లవారుతోంది. ఒక ఇంట్లోనించి ముసలాడు నిద్రలేచి తలుపు తీసుకుని బయటికొచ్చాడు. తన యింటి అరుగుమీద కూర్చుని ఏడుస్తూ "అమ్మా, అమ్మా" అంటున్న సీతను చూశాడు.

"ఎవరే, అమ్మాయీ, నువ్వూ? మీఅమ్మ ఎవరు? ఏమయింది?" అని అడిగాడు ముసలాడు.

"మా అమ్మ కనిపించటంలేదు," అని సీత, చెప్పింది.

"మీ అమ్మ పేరేమిటి? ఏం చీరె కట్టు కుంది? ఎట్లావుంటుంది?" అన్నాడు ముసలాడు.

"మా అమ్మ చక్కగా ఉంటుంది," అని సమాధానం చెప్పింది సీత.

ఆ తర్వాత ముసలయ్య ఎన్ని ప్రశ్నలు అడిగినా "మా అమ్మ కనిపించటంలేదు?"



"మా అమ్మ చక్కగా వుంటుంది" అని మాత్రమే సీత చెప్పింది.

ఇంతలో నలుగురూ పోగయారు. రామయ్యగారింటోనూ, కామయ్యగారింటోనూ, గోపాలంగారింటోనూ, తిరప తయ్యగారింటోనూ, ఇంకా డజను ఇళ్లల్లో వేడుక చూడవచ్చిన బంధువులు చాలా మంది ఉన్నారు. అందులో అందంగా వుండే ఆడవాళ్లందర్నీ పిలిపించి, "వీళ్ళలో మీ అమ్మ వుందా?" అని అడిగాడు ముసలాడు.

సీత ఒకర్నీ గుర్తుపట్టలేదు.

"మా అమ్మ ఇంకా బాగుంటుంది," అన్నది సీత.

"అంత భూలోకరంభ ఎవరబ్బా?" అనుకుంటూ ముసలాడు మనుషుల్ని ఇంకా దూరంపంపించి తిరణాలకి వచ్చిన పొరుగూరి ఆడవాళ్లలో అందగత్తెలను వందలకొద్దీ రప్పించాడు.

అందర్నీ చూసి సీత, "మా అమ్మ ఇంకా బాగుంటుంది," అన్నది.

ముసలాడి ప్రాణం విసిగిపోయింది. సీత కింత అన్నం పెట్టాడు. అన్నం తిని సీత మళ్లీ వీధి అరుగుమీదే కూర్చుంది. ఆమె కళ్లు తల్లికోసం తహతహ లాడిపో తున్నాయి.

ఝాము పొద్దెక్కింది. వీధివెంట మళ్లీ జనం సాగారు. ఒకర్నికూడా బీరుపోనీ కుండా సీత అందర్నీ చూస్తున్నది. సీత దగ్గర ముసలాడూ మరో పదిమందికూడా ఉన్నారు.

అకస్మాత్తుగా సీత "అమ్మా." అని పెద్ద కేక పెట్టి జనంలోకి పరిగెత్తింది. చప్పున ఒక ఆడమనిషి దగ్గిరికిపోయి కాళ్లు వాటేసుకుంది. ఆ మనిషి సీతను ఎత్తుకుని రొమ్ముకేసి అదుముకుని ఏదో మాట్లాడ సాగింది.

అందరూ ఆశ్చర్యపోయినారు. ఆ మనిషి సీత తల్లేనట! సీత తల్లి అందగత్తె కానే కాదు. లావుపాటి శరీరమూ, గరుకైన చర్మమూ, నల్లటిరంగూ, మొహాన స్ఫోటకం మచ్చలూనూ.

అయితే ఏం? సీత చెప్పినమాట నిజం. సీత కళ్ళకు వాళ్లమ్మకన్న అందగత్తెలేదు.

మీ అమ్మకన్న అందగత్తె ఎవరన్నా ఉందా? మీరు చెప్పండి!






[గతసంచిక తరువాయి]

కొన్ని సంవత్సరాలు గడిచాయి. వర్ధమానుడి ఓడలు సముద్రాలన్నీ చుట్టి వ్యాపారం సాగిస్తున్నాయి. కాని అతని బుద్ధి వ్యాపారంమీద లేదు. ప్రపంచంలో ఉన్న వింతలు చూడాలనే అభిలాష అతన్ని వేధించసాగింది. వామన ద్వీపంలో అతనికి కలిగిన అనుభవాలు అందరికీ చెప్పి చెప్పి పాతబడిపోయాయి. మరొక విచిత్రానుభవంకోసం వర్ధమానుడు తహతహ లాడసాగాడు.

ఒకనాడు వర్ధమానుడు వ్యాపారం వంకపెట్టుకుని తన ఓడలలో కల్లా మంచి ఓడమీద కొద్ది సరుకువేసుకుని తన దగ్గిర ఉండే మంచి కళాసులను వెంటబెట్టుకుని సింహళద్వీపానికి ప్రయాణం కట్టాడు. అక్కడ తన సరుకంతా అమ్ముకుని ఆరు నెలలకు సరిపోయే ఆహారపదార్థాలు తీసుకుని ఓడను పశ్చిమాభిముఖంగా నడిపించాడు.

పశ్చిమసముద్రం అతి ప్రమాదకరమైనది. అందులో నిత్యమూ తుపానులు రేగుతూ ఉంటాయి. ధైర్యశాలులైన నావికులు సహితం ప్రాణాలరచేతబట్టుకుని ప్రయాణంచేస్తారు. వర్ధమానుడి ఓడ త్వరలోనే ఈ తుపానులలో చిక్కుకుని దాని యిష్టంవచ్చిన దిక్కుగా పోసాగింది. కళాసులుమట్టుకు ఓడ మునిగిపోకుండా చాలా జాగ్రత్తపడ్డారు. ఈ విధంగా పోయి పోయి అనేకవారాలకు ఓడ మునిగిపోకుండా ఒక తీరం చేరింది. ఆ తీరం చూస్తే అది ద్వీపమో, ఖండమో తెలియరాలేదు. కనుచూపు మేరవరకూ తీరం ఉత్తర దక్షిణాలకు విస్తరించి ఉంది.

జోనాథన్ స్విఫ్టు వ్రాసిన 'గల్లివర్స్ ట్రావెల్సు'కు అనుకరణ



తీరమంతా గుట్టలమయంగా ఉంది. అందుచేత ఓడను కొంతదూరంలో నిలిపి, వర్ధమానుడూ అతని అనుచరులూ మంచి నీటి కోసం ఒడ్డుకువచ్చి అన్వేషించ సాగారు. దాపున ఎక్కడా మంచినీటిబావుల జాడలేదు. అందుచేత కొందరిని ఒక దిక్కుగా పంపి మరొకదిక్కుగా వర్ధమానుడు బయలుదేరాడు.

ఆప్రదేశమంతా గుట్టలమయంగాఉంది. ఎంత తిరిగినా ప్రయోజనం లేకపోయింది. అందుకని వర్ధమానుడు తిరిగి ఓడ దగ్గిరికి రాసాగాడు. కాని అతను అంత దూరం నుంచే ఓడను చూచునుగదా, అది లంగరు ఎత్తి శరవేగంతో సముద్రంమీదికి వెళ్లిపోతున్నది!

వర్ధమానుడుకి చెప్పరాని ఆగ్రహం వచ్చింది. తన అనుచరులకు మతి పోయిందా? తనను వాళ్లుమోసంచేస్తున్నారా? తనను ఈ తెలియనిచోట వదిలేసి ఎందుకు వాళ్లట్లా పలాయనంచేస్తున్నారు? ఈవిధంగా అనుకుంటుండగానే అతనికి ఒక భయంకర దృశ్యం కనిపించింది. ఒక బ్రహ్మాండ



మైన రాక్షసుడు సముద్రంలో దిగి తన ఓడను వెంటాడుతున్నాడు. వాడి ఆకారం చూస్తూనే వర్ధమానుడు కొయ్యబారి పోయి నాడు. ఈ రాక్షసుడు తనపడవను అందు కుంటాడేమో నని అతనికి భయంకూడా కలిగింది. కాని, అతని నావికులు చాలా సమర్థులు కావటంచేత త్వరలోనే కను చూపుమేర దాటిపోయినారు. ఆ రాక్షసుడు ఓడను పట్టుకునే ఆశవదిలి వెనక్కు తిరిగి రాసాగాడు. వాడు తనను ఎక్కడ చూస్తాడో అనేభయంతో వర్ధమానుడు కాలి బలంకొద్దీ పరుగెత్తి అడ్డం వచ్చిన ఒక గుట్ట ఎక్కాడు.

గుట్టమీదినుంచి చూస్తే రాక్షసుడి జాడ తెలియరాలేదు. తను రాక్షసుణ్ణి చూసినది నిజమా భ్రమా అని సందేహం కూడా కలి గింది. చుట్టూతా మూడునిలువులఎత్తు రెల్లు కనిపించింది. కాని అది రెల్లు కాదు, గడ్డి. గుట్టకు అవతలవేపు గోధుమపొలం ఉంది. కాని తొమ్మిది నిలువుల ఎత్తుండటంవల్ల వర్ధమానుడికి అది పొలమని తెలియలేదు. ఈ పొలం మధ్యగా ఒక విశాలమైన రాస్తా





కనపడింది. దానివెంట పోవటానికి వర్ధమానుడు నిశ్చయించాడు. ఆ దారిన ఒక గంట నడిచేసరికి ఒకకంచె వచ్చింది. అది మామూలు కంచెకాదు, మూడు నాలుగంతస్థుల ఎత్తున్నది. ఆ కంచెలో ఒక గేటూ, దాని అవతల మరొక పొలమూ ఉన్నది. దానిమీదిగా యెక్కి అవతలికి దిగటం వర్ధమానుడికి అసాధ్యమయింది. అందుచేత కంచెలో నుంచి దూరుదామనుకున్నాడు.

అతను ఈ ప్రయత్నంలో ఉండగా దభీమని చప్పుడయింది. మళ్లీ అటువంటి చప్పుడే అయింది. అ వేపు చూసేసరికి ఒక బ్రహ్మాండమైన రాక్షసుడు—తన ఓడను తరిమిన వాడివంటివాడే—వస్తూ కనిపించాడు. ఈ భూతాన్ని చూచేసరికి వర్ధమానుడికి గుండె జారిపోయింది. చప్పున మొక్కలచాటున దాక్కున్నాడు.

అ రాక్షసుడు గేటుదగ్గిరికివచ్చి గోధుమ పొలంకేసి కాస్సేపుచూచి ఉరుము ఉరిమినట్టు పెద్ద పెడబొబ్బ పెట్టాడు. ఈ కేక విని మరో ఏడుగురు రాక్షసులు చేతుల్లో కొడవళ్లు పట్టుకొనివచ్చారు. కేక పెట్టిన వాడు రైతు. మిగిలిన వాళ్లు కూలీలు. వాళ్లతో గోధుమపంట కొయ్యమని చెప్పాడు యజమాని.

వాళ్లు గేటుదాటి పొలంలోకి వచ్చి కోత ఆరంభించారు. వర్ధమానుడికి చాల భయం వేసింది. ఆ బ్రహ్మాండమైన కొడవళ్ళనుంచి తప్పించుకోవటం ఎట్లా? తన గతి ఏమి కావాలి? అట్లాగే వర్ధమానుడు వాళ్ళ కాళ్ల కింద పడకుండా, కొడవళ్లకు అందకుండా



తప్పించుకుంటూ పారిపోసాగాడు. కాని కొంతసేపటికి అతను ఒక మూల ఇరికి దారిలేకుండా పోయింది. అందుచేత వర్ధమానుడు మునివేళ్లమీద నిలబడి కూలి వాని కేసి పెద్ద కేకపెట్టాడు.

కోస్తున్న కూలీ ఈ కీచు కేక విని, కొయ్యటం ఆపి, పరికించిచూశాడు. కొంత సేపు చూడగా వర్ధమానుడు కనిపించాడు. వాడి కళ్లు అశ్చర్యంతో బయటికి వెళ్లుకొచ్చాయి. వర్ధమానుణ్ణి జాగ్రత్తగా రెండు వేళ్ళతోపట్టుకొని పైకెత్తి తన ముఖం ముందు పట్టుకొని వింతగా చూడసాగాడు. పొరపాటున కిందపడేస్తాడేమో నని వర్ధమానుడి ప్రాణాలు పిచపిచలాడాయి. కాస్సేపు ఇట్లా పరీక్షించి, ఆ కూలీ వర్ధమానుణ్ణి తన తలగుడ్డ మడతలో దాచుకుని యజమానివద్దకు వెళ్లాడు.

"ఇదుగో, ఏమయ్యోవ్? చూశావా ఈ వింత? బుల్లిమడిసి! మన బొటనవేలంత మడిసి! మనలాగే కాళ్లూ, చేతులూ, తలా అన్నీ ఉన్నై!" అన్నాడు కూలీ.

"ఏడిచావులే, యెదవా! పోయి పని చూచుకో!" అన్నాడు యజమాని. కూలివాడు తన గుడ్డ మడతలో నుంచి వర్ధమానుణ్ణి జాగ్రత్తగా పైకి తీసేసరికి యజమాని ఆశ్చర్యానికి మేరలేదు. అందరూ చేరారు. ఇటువంటి వింత ఎవరూ చూడలేదంటే చూడలేదనుకున్నారు. వాళ్లంతా చుట్టూ కూర్చుని మధ్యప్రదేశంలో వర్ధమానుణ్ణి పెట్టి ఏంచేస్తాడో అని ఆత్రంగా చూశారు.



వర్ధమానుడికి ఈ రాక్షసులభాష తెలియదు గనక వాళ్లు ఏమనుకొన్నదీ అతనికి అర్థంకాలేదు. అతను తన భాషలో వాళ్లతో ఈ విధంగా చెప్పుకున్నాడు :

" నేనుకూడా మీలాటి మనిషినే. నాకూ భగవంతుడు బుర్ర ఇచ్చాడు. అందుచేత మీరు కరుణించండి. హింసించకండి. "

అంత చిన్నమనిషికూడా మాటలునేర్చి మాట్లాడటం వాళ్లకి ముచ్చటవేసింది. అతని మాటలు అర్థంకాకపోయినా అతను పెట్టేదణ్ణాలు వారికి కొద్దిగా అర్థమయాయి. రైతు తన కూలీలను పనిలోకి తిరిగిపొమ్మని చెప్పి, వర్ధమానుణ్ణి చేతిగుడ్డలో చుట్టి జేబులో పెట్టుకుని తన పెళ్ళానికి పిల్లలకీ చూపించటానికి ఇంటికి వెళ్లిపోయినాడు.

రైతు ఇల్లు చేరేటప్పటికి భోజనాలవేళ అయింది. రైతు తన భార్యదగ్గిరికి వెళ్లి, జేబులోనుంచి గుడ్డతీసి, వర్ధమానుణ్ణి ఆమెకు చూపించాడు. అంత చిన్నమనిషిని చూడగానే ఆమె ఉలిక్కిపడి, కెవ్వున అరిచింది.

"ఆకారం చిన్నదిగాని జాగ్రత్తగాచూస్తే అంతా మనవంటి మనిషే. భయంలేదు, చూడు!" అంటూ రైతు వర్ధమానుణ్ణి భార్యచేతిలో పెట్టాడు. ఆమె కొన్నిసంజ్ఞలు చేసి అవి వర్ధమానుడికి అర్థమైనా యని తెలుసుకుని ముగ్ధురాలై పోయింది.

అతన్ని మధ్యపెట్టుకొని రైతూ, రైతు భార్యా, పిల్లలూ, ముసలమ్మా భోజనాలకు కూర్చున్నారు. అతని ముందుకూడా రెండు మెతుకులు వేశారు. అతను వాటిని రెండు చేతులా పట్టుకొని ఉపాయంగా, ముఖానికి అంటకుండా తింటుంటే వాళ్ళంతా విరగబడి నవ్వుతూ సరిగా భోజనం చెయ్యలేక పోయినారు.

[ఇంకా వుంది]





# శక్తికి మించిన కోరిక

చంద్రపాలుడు కాంచీపురానికి రాజు. ఆయన జాలిగుండె కలవాడు, ధర్మదాత. దయ, శాంతి చంద్రపాలుడికి పెట్టనినగలు. అంచేతనే ఆ రాజ్యం రామరాజ్యమని పేరు పొందింది. కాంచీపురంలో ప్రజలు అన్ని విధాలా సుఖంగా జీవిస్తున్నారు.

చంద్రపాలుడికి ఒక చక్కటి పంచకళ్యాణీ గుర్రం ఉన్నది. ఆ గుర్రమంటె రాజుకి ప్రాణమన్న మాట. ప్రతిరోజూ సాయంత్రం ఆయనకి పంచకల్యాణిపైన షికారు పోయిరావటం అలవాటు.

ఒకనాడు ఇట్లానే మామూలు ప్రకారం షికారువెళ్లి చంద్రపాలుడు కోటకు తిరిగి వస్తున్నాడు. సందెచీకట్లు నలుపక్కలా కమ్ముకుంటున్నాయి. మార్గ మధ్యంలో రాజుకి ఒక దీనమైన కంఠస్వరం చెవిని బడింది. ఇదేమిటా అని గిరుక్కున ఆ ధ్వని వచ్చిన దిక్కుకి తిరిగి చూశాడు చంద్రపాలుడు.

వా డొక బిచ్చగాడు. "బాబా! దాగం, దాగం!!" అంటూ నాలిక చాపి చేత్తోచూపిస్తున్నాడు. గబుక్కున గుర్రం దిగాడు చంద్రపాలుడు. బిచ్చగాడి అవస్థ కళ్లార చూశాడు. ఇది కనిపెట్టి బిచ్చగాడు, మరీ ఎక్కువగా బాధపడుతున్నట్టు దొర్లాడటం ప్రారంభించాడు.

'ఈ అబ్బికి పాపం నాలిక పిడచకట్టుకుపోయింది. కాసిన్ని నీళ్లు తెచ్చి గొంతు తడిపితేగాని బతికే ఎత్తు లేదు' అని కనికరం పుట్టింది చంద్రపాలుడికి. ఇహ ఒక్క క్షణమైనా జాగుచేయలేదు. పక్కనున్న చెట్టుకి తన పంచకళ్యాణిని కట్టేసి, నీళ్ల

వీరమాసునేని సంగమేశ్వరరావు, సంగంజాగర్లమూడి



ఎక్కడ దొరుకుతవా అని వెతుక్కుంటూ బయలుదేరాడు.

రాజు కనుమరుగు కావటం కనిపెట్టి, బిచ్చగాడు ఏంచేశాడనుకున్నారు? దాహం లేదు, గీహంలేదు. అంతా దొంగఎత్తే. కపట నాటకం! చక్కగా దుస్తులు ముస్తాబుచేసుకున్నాడు. చెట్టుని కట్టివున్న పంచకళ్యాణిని విప్పేసి దానిపైన ఎక్కి, చల్ రంగా అంటూ ఉడాయించాడు!!

తిరిగి తిరిగి చంద్రపాలుడు ఎక్కడనో ఇన్ని నీళ్లు పుట్టించుకువచ్చాడు. వచ్చి చూచేసరికి ఇంకేమిటుంది! దొర్లుతూ పండుకునివున్న బిచ్చగాడూ లేడు, చెట్టుకి కట్టిన పంచకళ్యాణీ కనబడదు!! రాజు అశ్చర్యపడ్డాడు. చుట్టుపక్కల వెతికాడు పంచకళ్యాణికోసం. ఎలుగెత్తి అరిచాడు. ఉహుం. ఏవిధమైన అలికిడీ లేదు. గుర్రం పరుగెత్తిన అడుగుజాడలబట్టి కొంతదూరం నడిచాడు. కాని, దానివల్ల ఏమీ ప్రయోజనం లేకపోయింది.

పంచకళ్యాణికోసం పలవరించిపోతూ, రాజు ఒక రాత్రివేళకు కాలినడకనే కోట చేరుకున్నాడు. చేరుకున్నాడేగాని, అతని నోటికి భోజనం సహించదు. కంటికి నిద్దర రాదు. ఎన్నడూ పంచకళ్యాణిని ఎడబాసి ఎరుగడు చంద్రపాలుడు. అంత అల్లారుముద్దుగా చూచుకుంటున్న తన గుర్రం జాడ తెలియక పాయేసరికి ఆయనకి మతి పోయినట్టయింది.

వాడవాడలా పరిచారకుల్ని పంపించాడు పంచకళ్యాణిని పట్టితేవటానికి. కాని, వాళ్ళందరూ తిరిగి తిరిగి. విసిగి వేసారి మర్నాటికి మళ్లీ కోటచేరుకున్నారు. గుర్రం

దొరకలేదనే ఓటిమాట వినేసరికి, రాజుకి ఆరాటం మరీ యెక్కువైపోయింది.

* * *

అర్ధరాత్రి సమయం. పట్టణ మంతా మాటుమణిగింది. పంచకళ్యాణిని గురించే ఆలోచించుకుంటూ చంద్రపాలుడు, అయిదో అంతస్థుమీద అటూ యిటూ పచారు చేస్తున్నాడు.

మునపటి మోస్తరుగనే, మేడ దిగువ నించి వినపడింది ఒక దీనాలాపం చంద్రపాలుడి చెవులకు: "బాబా, దాగం! బాబా, దాగం!!—" అంటూ.

"పోరా దౌర్భాగ్యుడా! మిమ్మల్ని నమ్మకూడదు!!" అని విసుగుతో అన్నాడు చంద్రపాలుడు.

"బాబా, దాగం! దాగం!! సత్తున్నా!!!" అని మళ్లీ వెంటనే రెట్టించింది ఆ కంఠస్వరం.

"ఇదేదో పూర్వంనించీ పరిచయమైన గొంతులా వినబడుతూంది. అది ఎవరిదై వుంటుందా?" అని జ్ఞాపకంచేసుకోటానికి యత్నిస్తున్నాడు చంద్రపాలుడు.



ఇంతలో, పారావాళ్లూ భటులూ కలిసి కేకలు వేస్తున్నారు: "పంచకళ్యాణి! పంచకళ్యాణి!!" అంటూ. పంచకళ్యాణి పేరు చెవినిపడ్డిందే రాజు గబ గబా మేడ దిగి వచ్చేశాడు.

రొజుకుంటూ రొప్పుకుంటూ అలిసిపోయిన పంచకళ్యాణి కంటపడేసరికి చంద్రపాలుడికి ప్రాణాలు లేచివచ్చాయి. గుర్రంపక్కనే తన బాల్యమిత్రుడు రాజశేఖరుడున్నాడు!! అతన్ని చూచి మరీ ఆశ్చర్యమయింది రాజుకి.



"నేస్తం! నీ కెక్కడ చిక్కిందోయి నా పంచకళ్యాణి?" అని ఆత్రంతో అడిగాడు రాజు, మిత్రుడి ముఖంలోకి వాత్సల్యంగా చూస్తూ.

రాజశేఖరుడి మనస్సు కలవరపడింది. మారుమాట చెప్పలేక, సిగ్గుతో తల వంచుకున్నాడు.

ఈ వాలకం గ్రహించాడు సూక్ష్మబుద్ధి గల రాజు. పంచకళ్యాణిని జాగ్రత్తగా కని పెట్టమని భటులకు ఆజ్ఞాపించి, మిత్రుణ్ణి చేయిపట్టుకుని అంతఃపురంలోకి తీసుకు పోయాడు చంద్రపాలుడు.

తరవాత కొంతసేపటికి రాజశేఖరుడు తేరుకున్నాడు. చంద్రపాలుడు కుశల ప్రశ్నలు వేస్తుండగా, అతడికి హఠాత్తుగా దుఃఖం పొంగి పొర్లి వచ్చింది.

రాజు అతణ్ని అనేకవిధాల ఊరడించేసరికి, రాజశేఖరుడు తన హృదయంలో వృత్తాంతం యావత్తూ దాపరికం లేకుండా చెప్పివేశాడు :

"మిత్రమా, చంద్రపాలా! పంచకళ్యాణిపైన నీకు పంచప్రాణాలు అన్న సంగతి నాకు తెలుసు. అటువంటి గుర్రం సంపాదించుదామని నేను నానాపాట్లూపడి దేశదేశాలు తిరిగాను, కాని నాకు లభించ లేదు. చివరికి మోసం చేసైనాసరే, నీ గుర్రాన్ని కాజెయ్యాలని నాకు దుర్బుద్ధి పుట్టింది. అందుకనే ఈవేషం వేశాను. వేసినందుకు తగినట్టు బుద్ధి చెప్పింది పంచకళ్యాణి..." అంటూ ఎంతో దీనంగా చూచాడు రాజు ముఖంలోకి.

"పడదొయ్యలేదుకద !" అని ఆత్రంగా అడిగాడు రాజు.

"పడదోసినా, పట్టు వదల్లేదు నేను మకుప్పకొద్దీ" అని అంటూ రాజశేఖరుడు తన తలపైన వున్న గుడ్డ తీసి కింద పడవేశాడు.

అబ్బా, నెత్తిమీద యెంత గాయం తగిలిందో! ఇంకా రక్తం చిమ్ముతూనేవుంది!! చంద్రుపాలుడికి అది చూచి కళ్లు తిరిగిపోయినాయి. తక్షణమే వైద్యుణ్ణి పిలిపించి కట్టు కట్టించాడు.

కొన్నాళ్లపాటు రాజశేఖరుణ్ణి రాజు కోటలోనే అట్టేపెట్టి చికిత్స చేయించాడు. రాజశేఖరుడికి ఇప్పు డిప్పుడు కొంచెం నిమ్మళించుతున్నది.

ఒకనాడు ఇష్టాగోష్ఠిగా మాటాడుకుంటున్నారు మిత్రు లిద్దరూ.

చంద్రపాలు డిట్లా అన్నాడు : "నేస్తం! మాటమాత్రం నాకు కబురుచేసి వుంటే పంచకళ్యాణిని నీకు పంపించి ఉందునే. అనవసరంగా ఎన్నెన్నిపాట్లు పడ్డావోయ్. ఇప్పుడైనా మిగిలిపోయిందిలేదు; సంతోషపూర్వకంగాదాన్నినీకిస్తున్నా, తీసుకువెళ్లు."



"చంద్రపాలా! నువు అడ్డుచెప్ప వని నాకు తెలుసు. అయినా, ఇక ఆ విషయం తలచవద్దు. నాకు సరదా తీరిపోయింది. 'శక్తికి మించిన కోరిక' పనికిరాదనే పెద్దల వాక్యం నాకు అనుభవమైంది," అని రాజశేఖరుడు జవాబు చెబుతూ మిత్రుడి దగ్గర సెలవు తీసుకొన్నాడు.

కనుక, పాపలూ! మీరుకూడా మీశక్తికి మించిన కోరికలు కోరకుండా, వున్న దాంట్లోనే తృప్తిపడితే సుఖంగా వుంటారు.




# గయ్యాళిగౌరి

అనగా, అనగా ఒక రాజుండేవాడు. ఆ రాజుకు ఒక్కతే కూతురు. ఆ అమ్మాయి పేరు గౌరి. గౌరికి చిన్నతనంలో తల్లి చనిపోయింది. తండ్రి గారాబు పెంపకంలో గౌరి హద్దూపద్దూ లేకుండా పెరిగింది. ఏ పట్టు పడితే, అదే మూర్ఖపుపట్టు. తండ్రి, గౌరిచెప్పిన మాటే నమ్ముతాడు, శిరసా వహిస్తాడు. రాజకీయ విషయాలలో గూడ, గౌరివే పైచెయ్యి. రాజోద్యోగులకు గౌరంటే సరిపడేదికాదు. కాని పైకి ఏమీ అనలేక లోలోపల "ఏ నక్షత్రాన పుట్టిందమ్మా, ఇంత గయ్యాళి గంప!" అని సణుగుకునే వారు.

గౌరి గయ్యాళిదైనా, చాల అందమైన పిల్ల. ఆ అమ్మాయి నాట్యంచేస్తున్నా, పాట పాడుతున్నా ఎంతో ముదిపెంగా ఉండేది. "ఇంత చక్కటి విగ్రహంలో, ఈ పెంకితనం ఎట్లా దాక్కుందో"నని చాలామంది ఆశ్చర్యపడేవారు.

ఇప్పుడు గౌరికి పదహారో ఏడు. ఒకనాడు అంతఃపురం మూడో అంతస్తుమీద పచార్లు చేస్తూండగా కింద సెలయేటిలో చేపలుపడుతున్న ఒక యువకుడు గౌరికి కనిపించాడు. అతడూ, చాలా అందమైనవాడు. చేపల అమ్మకమే అతని జీవనము. గౌరి అతనిని సమీపించి, చేపలు బేరంచేసి తీసుకుని, మామూలుకన్నా నాలుగింతలు బంగారమిచ్చింది. ఎందుకు అధికంగా ఇచ్చిందో అతనికి అర్థంగాకపోయినా, సంతోషించి, సవినయంగా నమస్కారం చేశాడు. ఇలాగే గౌరి ప్రతిరోజూరావడమూ, అధికంగా బంగారమిచ్చి, అతను ఆనాడు పట్టిన చేపలన్నీ కొనడమూ జరిగిపోతోంది.

ఒకనాడు హటాత్తుగా గౌరి ఆ బెస్తవాడిని "నన్ను పెళ్లి చేసుకుంటావా?" అని అడిగింది.

ఒక మహారాజు కూతురి నోటివెంట యిలా మాటలు రావటం వినేసరికి బెస్తవాడు నిర్ఘాంతపోయాడు. చివరకు తెప్పరిల్లి: "మరి నేను బెస్తవాడినే.... మీరు మహారాజులు...మీ నాన్నగా రేమంటారో...." అన్నాడు.

ముక్కామల నరసింహారావు — గుంటూరు



గౌరి నవ్వుతూ అన్నది: "అదంతా నీకెందుకు? నే చెప్పినదానికి మా నాన్న ఎదురు చెప్పడు. నా మాటప్రకారం జరిగి తీరవలసిందే!" అతడు మౌనంతో తన అంగీకారం సూచించాడు.

వెంటనే గౌరి తండ్రిని ఒప్పించి, నిశ్చయించింది పెళ్లి. అతనికి దుస్తులకుగాను, ఒక పెట్టెతో బంగారం పంపింది. అతడు సర్వాలంకారాలు చేసికొని పెళ్లికి తరలి వచ్చాడు. రాజమర్యాదల ప్రకారం పెళ్లి జరిగింది.

పెళ్లినాటిరాత్రి విందులో, రాజమర్యాద ప్రకారము వధూవరు లిద్దరూ బంగారు పళ్ళెంలో కలిసి భుజించాలి. కాని, గౌరికి అది యిష్టంలేదు. పెద్ద పెద్ద రాజోద్యోగులు, సామంతరాజులు, విందుకు పంక్తిలో నున్నారు. గౌరికి, అయిష్టమైనా ఆచారప్రకారం బంగారుపళ్లెంలో ఇద్దరికీ వడ్డించారు. గౌరికి మితిలేని అహంకార మొచ్చింది. వరుడికి వేరే పళ్ళెము పెట్ట మన్నది. కాని పెద్దలు ఒప్పుకోలేదు.

శివమెత్తినదానికి మల్లే, గౌరి : "రాచ మర్యాద పాటించడం, వధూవరు లిద్దరూ రాజకుటుంబీకు లయినప్పుడుగాని వరుడు బెస్తవాడయినప్పుడు గాదు"అని అరిచింది.

ఇది వినేసరికి అంతా తెల్లబోయారు. విందుకొచ్చిన పెద్దలలో గుసగుసలు బయలుదేరినై. రాణివాసపు స్త్రీలంతా ముక్కున వేలేసుకున్నారు. అందరూ ఒక్కమాటుగా పెళ్లికుమారుని వైపు ఎగాదిగా చూచారు. వెయ్యిశూలాలతో పొడిచి నట్లయింది అతనికి. అతను వెంటనే అక్కణ్ణించి లేచి, వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. విందులో కల్లోలం బయుల్దేరింది. గౌరికళ్ళల్లో నీరునిండింది. పసిపిల్ల మాదిరిగా పెద్దగా ఏడవసాగింది. పాపం! గౌరి, అతనిని నిజంగా ప్రేమించింది. కాని తన అహంకారమూ, ధనగర్వమే, యిలా జరగటానికి కారణమని గ్రహించి చాలబాధపడ్డది. ఈ హడావిడిలో



వరు డెటుపోయాడో ఎవ్వరూ చూడలేదు.

గౌరి ఈ అవమానాన్ని భరించలేక పోయింది. ఆ రాత్రే అంతఃపురం వదలి అతనిని వెతకడానికి బయలుదేరింది.

వేళకుతిండిలేక, దిగులుతో సగమయి, అలా భర్తని వెతుకుతూ పోగా పోగా, కొన్ని రోజులకు ఒక చిన్న గ్రామంలో గౌరికి తన భర్త కనిపించాడు. అతడు చాలా మారిపోయాడు. పట్టుదల అతని కళ్ళల్లో తాండవిస్తూంది. అతడు గౌరిని గుర్తించాడు. కాని మాట్లాడకుండా తిరిగిపోయాడు.

గౌరికి రోషమొచ్చింది. అయినా అతనికి తెలియకుండానే అతనిని అనుసరించి వెళ్లి, చివరకి అతను ఒక గుఱ్ఱపుశాలలో పనిచేస్తున్నట్లు తెలుసుకుంది. ఆ గుఱ్ఱపుశాల యజమానిని సమీపించి, అతనిదగ్గర పనిచేస్తున్నది తన భర్తేననీ, తనమీద కోపంచేత తనతో మాట్లాడటం లేదనీ చెప్పింది.

అందుకు యజమాని పెద్దగా నవ్వి : "భలేదానివే! మహ చక్కటికథ అల్లావ్! అతడు మూగవాడు....బ్రహ్మకూడా అతన్ని మాట్లాడించలేడు" అన్నాడు.

ఇది వినేసరికి గౌరికి కోపమొచ్చింది; యజమాని తననిమోసగిస్తున్నాడని తెలుసుకుంది. "తప్పకుండా మాట్లాడిస్తా"నంది.

"పుట్టుమూగను పలికించడం నీచేతగా"దన్నాడు యజమాని.

"అలాగాదు నాకు మూడురోజులు గడువివ్వండి. ఈ మూడు రోజులలో పలికించలేకపోతే....నాకు ఏ శిక్షయినా విధించండి" అంది గౌరి.

"ఎందుకమ్మాయ్, వృధాగా ప్రయత్నం చేసి ఓడిపోతావ్. నీకు తెలియదేమో, ఈ వూరిలో పందెం మొడ్డి ఓడిపోయినవాళ్ళకి శిరచ్ఛేదన" అన్నాడు యజమాని.

"అందుకు కూడా సిద్ధమే" అంది గౌరి.

గౌరి ఆనాటినించీ అతన్ని మాట్లాడించటానికి అనేక ప్రయత్నాలు చేసింది. అతను ఉలకలేదు; పలకలేదు. రోష మొచ్చి అతనిని దూషించింది. అతను దీనికికూడా ఏమీ మాట్లాడలేదు. తిరిగి వెళ్ళిపోయాడు. గౌరి పెద్దగా ఏడ్చింది.

రెండవరోజు, గౌరి తన చాకచక్యమంతా వినియోగించి బ్రతిమాలింది. తను అతనిని ప్రేమించిన మధురక్షణాలు జ్ఞాపకము చేసింది. కాని అతడు చలించలేదు.

మూడవరోజు కూడా గౌరి తన పంతం నెగ్గించుకొనలేకపోయింది. పందెము ఓడిపోయింది. "శిక్ష విధించాలి" అని నిశ్చయించారు.

* * *

ఆరోజు గౌరికి ఉరిశిక్ష. గౌరి కన్నీళ్లతో భర్తవైపు చూసింది. అతను గంభీరంగా ఉన్నాడు. చూడవచ్చినవారిని అందరినీ వేడుకుంది. కాని ఎవ్వరూ జాలిపడలేదు. పెద్ద పెట్టున ఏడ్చింది. ఇప్పుడు గౌరికి తన తప్పు తెలిసింది. తన అహంకారమే తన్నీగతికి తెచ్చిందని గ్రహించింది.

తలారి గౌరిని శిరచ్ఛేదనకై వెంటబెట్టుకొని వెళ్లాడు. కాని సమయానికి "ఆపండి ...వధ ఆపండి" అని ఒక కేకవినబడింది.



ఆ గొంతు ఆమెభర్తదే! పుట్టుమూగ ఎట్లా పలికాడా అని అందరూ ఆశ్చర్యపడ్డారు.

అప్పుడు గౌరిని ఆదరంగా దగ్గరికి తీసి కొని ఆమెభర్త జరిగిన కథంతా చెప్పాడు. 'గయ్యాళికి తగిన శాస్తి జరిగిం'దన్నారు వచ్చినవారంతా.

గౌరికి కోపంరాలేదు. తనతప్పు క్షమించమని భర్తను వేడుకొంది. భార్యా భర్తలిద్దరూ తిరిగి తమరాజ్యం చేరారు. అందరికీ బ్రహ్మానందమైంది. "అప్పుడు గాదు ఇప్పు"డని సకల వైభవంగా వారిద్దరికీ వివాహంచేశారు. కథ కంచికి, మనమింటికి.



# తగిన శాస్తి

ఒక వూళ్లో ఒక రాజున్నాడు. ఆ రాజుకి యిద్దరు భార్యలు. వాళ్లిద్దరిమీదా రాజు సమానమైన ప్రేమ కలిగివుంటున్నాడు. కాని, చిన్నరాణీకిమాత్రం రాజంటె ప్రేమ లేదు. పైగా- రాజునీ, పెద్దరాణీనీ ఎలాగైనా చంపించివేసి తనే రాజ్యం ఏలుదామని దురుద్దేశంతోవున్నది.

ఈ వుద్దేశంతోనే రోజూ రాజుగారికి క్షవరంచేసే మంగలిని పిలిపించింది. కారణమేమై ఉంటుందా అని భయపడుతూ మంగలి చిన్నరాణి అంతఃపురానికి వెళ్లాడు.

ఆత్రంతో వేచిఉన్న చిన్నరాణి, వాడు కనబడగానే దాసీవాళ్ళనందర్నీ అవతలకి పొమ్మని ఆజ్ఞాపించింది. వాళ్లందరూ వెళ్లి పోగానే మంగలిని పిలిచి ఇలా చెప్పింది: 'ఓయి మంగలీ! నే నొక పని చెప్తాను. చెప్పినట్టు చేశావో వెయ్యిరూపాయలిస్తాను. నువు కోరుకున్న భూములిస్తాను. చెయ్యక పోయావంటే తల కొట్టి కోటగుమ్మానికి వేలాడదీయిస్తాను.'

మంగలి వణికిపోతూ, "చెప్పండి తల్లీ! తప్పకుండా నడుచుకుంటాను" అన్నాడు.

అప్పుడుచిన్నరాణి మంగలితో, "ఒరేయ్, నేను చెప్పబోయేది చాలా రహస్యం. పిట్టకయినా తెలియనివ్వకూడదు సుమా" అని హెచ్చరించి, ఇట్లా చెప్పింది:

"నువు రాజుగారికి క్షవరంచేసేటప్పుడు గురిచూసి, వారి కంఠం కోసెయ్యాలి. తెలిసిందా?" అని చెప్పి, వెయ్యిరూపాయల సంచి వెంటనే చేతికిచ్చింది. పని జరిగిన తరవాత కోరుకున్న భూము లిస్తానన్నది.

'ఈ పని జాగ్రత్తసుమా!' అని మంగలిని మరి మరి హెచ్చరించి పంపింది. బహుమానాలకు ఆశపడిన మంగలి, రాజుగారికి మళ్ళీ ఎప్పుడా క్షవరంచేయడం అని సమయంకోసం ఎదురుచూస్తున్నాడు.

* * *

రాజుగారి కోటకి అయిదుమైళ్ళ దూరంలో ఒక చిన్న పల్లెటూరు ఉన్నది. ఆ వూళ్లో ఒక పేద బ్రాహ్మడుండేవాడు. ఆ వూరికి

టి. సత్యవతీదేవి — తాడేపల్లిగూడెం

రాజుగారి బస్తీకీ మధ్యని ఒక చిట్టడవి ఉంది. ప్రతిరోజూ ఆ అడవి దాటి అయిదు మైళ్లూ నడిచివచ్చి, బ్రాహ్మడు రాజుగారి బస్తీలో 'సీతారామాభ్యాంన్నమః' అని అంటూ భిక్షాటన చెయ్యాలి. ఆ వూళ్లో దొరికిన బియ్యపుగింజలు పట్టుకుపోయి, భార్యా బిడ్డల్ని పోషించుకోవాలి.

ఒకనాడు మామూలు ప్రకారం బ్రాహ్మడు తెల్లవారుఝామునే లేచి అడవి మార్గంపట్టి వెళుతున్నాడు. కొంతదూరంలో ఒక ఎలుగ్గొడ్డు కనపడింది. అది దాని వీపు ఒక చెట్టు మొదలుకి పెట్టి రాసుకుంటూ వుంది. తనవైపే వస్తుందనుకున్నాడు బ్రాహ్మడు. భయంచేత అతనికి ముచ్చెమటలూ పోసేసి, కాళ్ళూ చేతులూ కంపించండం ప్రారంభించింది.

సరే, పైన దేముడున్నాడుకదా అనిచెప్పి గుండె నిబ్బరం చేసుకుని, బ్రాహ్మడు ధైర్యంతో యిట్లా ఎలుగొడ్డును వర్ణిస్తూ పాట మొదలెట్టాడు:

" రాస్తావ్-రాస్తావ్-చూస్తావ్
చూచి-చూచి-ఏం చేస్తావ్ ? "

కొంతసేపటికి ఎలుగుబంటి దాని దారిని అది పోయింది. బ్రాహ్మడు సంతోషపడ్డాడు.

ఆ సంతోషంలో బ్రాహ్మడు, తన మామూలు 'సీతారామాభ్యాంన్నమః'



అనటం మరిచిపోయి, ఊళ్లో యాయవారానికి వెళ్లినప్పుడు కూడా—

" రాస్తావ్-రాస్తావ్-చూస్తావ్
చూచి-చూచి, ఏం చేస్తావ్ ? "

అని పాడుతూ భిక్షాటన చేస్తూవచ్చాడు.

ఊళ్లోపని ముగించుకుని బ్రాహ్మడు కోటలోకి వెళ్లాడు. అక్కడా ఈకొత్తపాటే పాడేసరికి మామూలుప్రకారం అతడికి ఎవరూ సంభావన ఇవ్వలేదు. కనిపెట్టుకుని కనిపెట్టుకుని విసుగొచ్చింది బ్రాహ్మడికి. చివరికి, అక్కడ కిందని ఒక బొగ్గు అగపడేసరికి దానితో కోట గోడమీద తను నిలబడ్డచోటున ఆ పాటనే రాసేసి ఇంటికి వెళ్లిపోయాడు.



ఆ మరసనాడు రాజు క్షవరం చేయించుకోటానికని మంగలిని పిలిపించారు. సమయం చిక్కిందికదా అని వాడు చాలా సంతోషపడ్డాడు.

బ్రాహ్మడు పాట రాసిన గోడకి ఎదురుగానే రాజుగారు కుర్చీ వేయించుకుని క్షవరాని కూర్చుని, మంగలివేపు చూచారు.

మంగలి పొదినుంచి కత్తితీసి నూరటం ప్రారంభించాడు, కాని చేతులు వణికాయి. మళ్ళీఎట్లానో ధైర్యంతెచ్చుకుని, చాలా సేపు కత్తి పదునుపెట్టి, రాజుగారి మెడవైపు ఒకసారి తనకత్తివేపు ఒకసారిచూస్తూవున్నాడు.

ఇంతలో రాజు, తన ఎదట గోడమీద ఉన్న పాట చూచి పైకి చదివాడు.

రాజు పాడగానే మంగలి, తననిగురించే అనుమానించి ఇట్లా పాడుతున్నా డనుకుని, చేతిలో కత్తీ, పొదీ అక్కడే విడిచిపెట్టేసి, తుర్రుమన్నాడు.

నలుగురూకలిసి మంగలినిపట్టి బంధించారు. రాజుయెదుట నిలబెట్టారు. ఒక్క ముక్క కూడా దాపరికం లేకుండా ఉన్న దున్నట్టు మంగలి చెప్పేశాడు.

చిన్నరాణీ చేసిన మోసంతెలిసి, సభలో అందరూఆశ్చర్యపోయారు. రాజుకిఆగ్రహం కలిగింది. చిన్నరాణిని నిలబడ్డపాటున లాక్కురమ్మని ఆజ్ఞాపించాడు.

చిన్నరాణీవచ్చి - "తెలియక చేశాను. ఈ తప్పు క్షమించండి!" అంటూ ఎంతో ప్రాధేయపడింది.

"ఇటువంటి దుష్టురాలిని ఎంతమాత్రమూ క్షమించరాదు. అరణ్యంలోకి తీసుకువెళ్లి తల నరికితెచ్చి కోటగుమ్మానికి వేలాడతీయవలసింది. ఈ మంగలిని ఒక పుష్కరంపరకు చెరసాలయందు ఉంచవలిసింది" అని రాజు శిక్షలు విధించాడు.

* * *

ఇదంతా జరిగిన తరువాత రాజుకి ఒక చిన్న సందేహం కలిగింది: 'ఈ కోటగోడ మీద వున్న పాట చూడడంవల్లకదా నా ప్రాణాలు తక్కినాయి? ఇటువంటి పాట ఎవరు రాశారు, ఎందుకు రాశారు?'—అని. 'ఈ పాట ఎవరు రాశారో వారికి వెయ్యి న్నూటపదహార్లు బహుమానం యిస్తామని చాటింపు వేయించ' మని ఆజ్ఞాపించాడు.

అట్లానే వేయించారు. ఆ చాటింపు విన్నవాళ్లందరూ ఆ రాసింది నేనే, నేనే అంటూ దెబ్బలాడుకుంటూ రాజుగారి కోటలో ప్రవేశించారు. రాజు వీళ్ళ నందరినీ చూచి, "సరే, బాగానే వుంది. ఈ పాట రాసిన కారణం యేమిటి?" అని అడిగే సరికి సమాధానంచెప్పలేక, తెల్లమొహంవేసి ఒక్కొక్కళ్లే జారుకున్నారు.

* * *

మ్మరునాడు మామూలుగా మన బ్రాహ్మడు ఊళ్ళోకి వచ్చాడు యాయువారంకోసం. ఎవళ్లుచూసినా ఆ గోడమీది పాటనిగురించే వింతగా చెప్పుకుంటుకున్నారు.

కోటలోకి వెళ్లి బ్రాహ్మడు ఒక భటుణ్ని పిలిచాడు. 'ఈ కోటగోడమీద పాట రాసిన బ్రాహ్మడు వచ్చాడు' అని వర్తమానం చేశాడు రాజుగారికి.



రాజు సంతోషంతో బ్రాహ్మణ్ని లోపలికి పిలిపించి, ఈపాట రాసినకారణం ఏమిటని ప్రశ్నించాడు. బదులుగా అడవిలో ఎలుగు బంటి కథఅంతా పూసగుచ్చినట్టు చెప్పాడు బ్రాహ్మడు.

ఇది విని రాజు, బ్రాహ్మడికివెయిన్నూట పదార్లు బహుమానమియ్యటమే గాకుండా, తన కొలువులో ఉద్యోగం యిప్పించాడు. అంతటితో బ్రాహ్మడి దరిద్రం తీరిపోయింది. చక్కా ఉద్యోగం చేసుకుంటూ భార్యా బిడ్డలతో హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు.




పాపాయిలూ! —

నల్లనల్లగా కనపడే గోరింకపిట్టని చూశారు కద! ఎగిరి యెగిరి, మిడతల్ని దండుకుంటూ అస్తమానం మన పెరళ్లల్లోనే తచ్చాడుతూ వుంటుంది; గోరింకని ఎవరెరుగరూ?

గోరింక మన కీనాడు నల్లటి రంగుతో కనబడుతున్నదేకానీ, మొదట్లో అసలు దాని రంగు నలుపు కానేకాదు.

పూర్వకాలమందు అది చాలా అందంగానూ, హంసకంటె కూడా తెల్లగానూ వుండేది. అయితే మరి, యిప్పుడది ఎంచేత నల్లబడిపోయిందీ అని అడుగుతారేమో? దీన్నిగురించి ఒక గమత్తయిన గాథ వుంది, చెబుతా:

ఒక రోజున గోరింక అకాశమార్గాన ఎగురుతూ, చెట్టుమీద పనిచేసుకుంటున్న కొండపిట్టని చూసి కిందికి దిగింది. ఆ కొండపిట్టముందు తళతళా మెరసిపోతూ వెండి బంగారాలు కుప్పలుగా పోసి వున్నయి.

తక్కిన పక్షులు వేటి కంటా పడకుండానే ధనరాసులు దాచేసుకుందామని కొండపిట్ట ప్రయత్నిస్తోంది. కాని, ఇంతలోనే గోరింక అక్కడ వాలడంచేత దాని రహస్యం కాస్తా బయటపడ్డది.

పోనీ, వెళ్లిన గోరింక నా కెందుకని ఊరుకోవచ్చా? ఊహుఁ—ఆరా తీయటం ప్రారంభించింది: "అక్కా అక్కా! ఈ ధనమంతా నీకు ఎవరిచ్చారు? ఎట్లా వచ్చింది?" అంటూ ఒక లక్ష ప్రశ్నలు వేసింది.

కొండపిట్టకైతే రహస్యం చెప్పడం ఇష్టం లేదు. ఎవరికిమాత్రం ఇష్టం వుంటుంది ఇంటిగుట్టు వెల్లడిచేసుకోవటం? కాని, ఈ

నంది నూకరాజు — పెద్దాపురం

గోరింకకు చెప్పకపోయినట్టయితే, ఇది పోయి తక్కిన పక్షు లన్నింటికీ చెప్పేస్తుం దేమో! అందువల్ల మ న కు చాలా ప్రమాదం కలుగుతుందే, అని భయం పట్టుకుంది.

చేసే దేముంది? చెప్పక తప్పదు. సరే, గోరింకచేత ఒక పంద ఒట్లు వేయించు కుని, కొండపిట్ట, తనకి ధనం దొరికిన విధం ఇట్లా వెల్లడిచేసింది:

"చెల్లీ! చూడు, నీకు నే నొక పెద్ద గుహ అనవాలు చెబుతాను. ఆ గుహలో నించి పోగా పోగా ఒక గది అగపడుతుంది. అందులో వెండిరాసు లుంటాయి. కాని వాటివైపే చూడవద్దు. ఇంకా వెళ్లగా మరొక గది కనిపిస్తుంది. దాన్లో బంగారపు రాసు లుంటాయి. అదీ తాకవద్దు. మరికొంచెం దూరం పోతే మూడవ గది అగుపిస్తుంది. అందులో ఒక రాజు ఉంటాడు. ఆ రాజు నడిగావంటే నువు కో రి న ం త ధనం కురిపిస్తాడు" అని చెప్పింది.

సరేనని గుట్టు తెలుసుకుని, గోరింక బయల్దేరింది. గుహలోకి ప్రవేశించింది. కొంతదూరం పోగా వెండిరాసులున్న గది వచ్చింది. 'ఇవన్నీ నాకుంటే మహబాగా



ఉండును' అనుకుని ఉవ్విళ్ళూరింది. కానైతే, కొండపిట్ట చెప్పిన మాటలు జ్ఞాప కానికి వచ్చినై.

ఇంకా వెళ్ళేవరకు మరోగదిలో బంగారు రాసులు అగపడినయి. ఇహ వాటిని చూడ గానే మనసు ఉండబట్టింది కాదు. ఎట్లా గైనా వాటిని ఎత్తుకుపోవాలనే దు రా శ తో బంగారాన్ని ముక్కుతో ముట్టుకున్నది.

గోరింక ముక్కు బంగారానికి తగలడ మేమిటి!! ముక్కులోంచి పొగలు కక్కు కుంటూ భయంకరమైన రాక్షసి రాసిలో నించి రావడమేమిటి!!!

ఆ రాకసి వచ్చేసరికి గది అంతటా పొగలు కమ్మేశాయి. గోరింకకు కంగారు పుట్టింది.

"నువ్వు ఎవరవు? ఈ గదిలోకి ఎట్లా వచ్చావు? ఈ బంగారపు రాసి ఎవరి దను కున్నావ్? అది ఎందుకు ముక్కుతో పొడి చావ్? చెప్పు చప్పున? చెప్పకపోయినా వంటే యేంచేస్తానో చూసుకో!" అంటూ ఆ రాకసి గోరింకని గద్దించింది.

వణికిపోతూ గోరింక—తను కొండపిట్ట వద్దకు దిగిరావడమూ, గుట్టుమట్టులల్లా తెలుసుకోవటమూ, గదిలోకి రాగానే తనకి మనస్సులో దుర్బుద్ధి పుట్టడమూ—ఈ సంగతి సందర్భాలన్నీ మాయా మర్మం లేకుండా చెప్పివేసింది.

"సరే, నువు అడగ్గానే నిజం చెప్పేశావు గనక, క్షమించి నిన్ను మింగెయకుండా విడిచిపెడుతున్నాను. కాని, నీకు మనస్సులో దురాశ కలగడంచేత అందుకు తగిన శిక్ష పొందితీరవలసిందే. తప్పించుకోవీల్లేదు. ఫో, ఇంకముందైనా బుద్ధి కల్గి మసులుకో" అని రాకసి కసిరి కొట్టింది గోరింకని. గోరింకకు ఊపిరాడక బయటికి వచ్చేసింది. రాకసి ఇచ్చిన శాపం వల్ల చక్కగా తెల్లగా వుండేటటువంటి ఆ గోరింక శరీరం యావత్తూ నల్లబడి పోయింది! ఐతే ముక్కుతో బంగారపు రాశి పొడిచిందికదూ. అందుకని బంగారం దాని ముక్కుకి అంటుకొని ఆ కాస్తమేర పచ్చగా వుండిపోయింది.

చూశారా, గోరింక ఎన్నిబాధలు పడిందో? కొండపిట్టను గుట్టుచెప్పమని నిర్బంధించడం ఒక తప్పు. అది చెప్పినట్టు అక్షరాలా నడుచుకోకపోవటం రెండో తప్పు. గదిలో ప్రవేశించి, వెండి బంగారాలు చూడగానే దురాశ చెందటం మూడో తప్పు. ఇన్ని తప్పులు చేసింది గనకనే గోరింకకు రాకసి శాపం పెట్టింది. శాపం తగలటంవల్లనే అందంగాను, తెల్లగాను వుండే గోరింక నల్లగా మాడిపోవలసిన గతి పట్టింది.






(గతసంచిక తరువాయి)

రాజకుమార్తె చెప్పినదంతా వినేసరికి రాజకుమారుడికి చాల ఆశ్చర్యం వేసింది. "అలాగేపోతాను. కాని ఈసారిఅతను ఏపని చెబుతాడో నీకు తెలుసా?" అని అడిగాడు.

"తెలుసును. ఈసారి అతను నిన్నొక చీకటి గదిలోకి తీసుకుపోతాడు. ఆ గదిలో ఒక పెద్ద గొయ్యివుంటుంది. నిన్ను ఆ గోతి చుట్టూ మూడుసార్లు ప్రదక్షిణం చెయ్యమంటాడు. 'నేను చెయ్యను' అని నీవు అంటే నిన్ను చంపేశక్తి అతనికి వస్తుంది గదా. అందుకని నువ్వు అలాగే ప్రదక్షిణం చేస్తావు. చీకట్లో అతను నీ వెనకనే వచ్చి నిన్నుగోతిలోకి తోస్తాడు. తిండీతిప్పలూ లేక గోతిలోవాడివి గోతిలోనే చస్తావు. అప్పుడు నీ గుండెకాయ తింటాడు." అని చెప్పింది రాజకుమార్తె.

"అలాగైతే ఈ అపాయం నించి తప్పించుకునే మార్గం ఏమైనా నాకు చెప్పగలవా?" అని అడిగాడు రాజకుమారుడు.

అప్పుడు రాజకుమార్తె యిలా చెప్పింది: "అతను నిన్ను గదిలోకి తీసుకువెళ్లి గోతి చుట్టూ తిరగమంటాడు. అప్పుడు నువ్వు, 'ఈచోటు నాకు కొత్త. పైగా ఈ చీకట్లో నేను గోతిచుట్టూ ఎలా తిరగగలను. కాని, నువ్వు ముందు దారిచూపుతుంటే నీ వెనకడితే నేనూ వస్తూ అలాగే మూడుసార్లు ప్రదక్షిణం చేస్తాను' అని చెప్పు. అతను చేసేదిలేక అలాగే ముందు నడుస్తుంటాడు. అప్పుడు నువ్వు నీ కత్తితో సమయంచూసి అతన్ని పొడువు. ఒకవేళ అలా చెయ్యలేకపోయినా యివాల్టికి నీ గండం గడుస్తుంది. రేపు ఏంపని యిస్తాడో ఈ రాత్రి నేను అతన్ని అడిగితెలుసుకుంటాను. రేపు మళ్లీ నా దగ్గరికి వచ్చి ఆ సంగతి తెలుసుకో. ఇప్పు డతను వచ్చేవేళఅయింది. పువ్వు నా చెవిలోపెట్టి వెళ్లిపో" అన్నది రాజకుమార్తె.

రాజకుమారుడు అలాగే గులాబీ పువ్వును తిరిగి రాజకుమార్తె చెవిలో

బి. వేణుగోపాల్ — మద్రాసు.



పెట్టాడు. ఆమె వెంటనే స్పృహతప్పి అదివరకటిలాగానే పడుకుండిపోయింది. రాజకుమారుడు బైటికివచ్చి ఆవరణలో కూర్చున్నాడు.

మరి కాసేపటికి రాక్షసుడు తిరిగి వచ్చాడు. ఈమారు అతను అదివరకటిలాగా సన్యాసి వేషంలోరాలేదు. అతని అసలు రాక్షసరూపంతో వచ్చాడు. రాజకుమారుడు యింకా బ్రతికే వుండటం చూసేసరికి అతనికి ఆశ్చర్యం వేసింది. కాని ఆ ఆశ్చర్యాన్ని బైటికి కనపర్చకుండా, రాజకుమారుణ్ణి తన వెంట ఒక చీకటి గదిలోకి తీసుకుపొయ్యాడు. రాజకుమార్తె చెప్పినట్లుగానే రాక్షసుడు, రాజకుమారుణ్ణి గోతిచుట్టూ ప్రదక్షిణం చెయ్యమన్నాడు.

"అలాగే ప్రదక్షిణం చేస్తాను. కాని, ఈచోటు నాకు అసలే కొత్త. అందులో యిక్కడ అంతా చీకటి గబ్బగయ్యంగా వుంది. దారి నాకు కొంచెంకూడా తెలియటంలేదు. అందుకని నువ్వు ముందు దారి చూపుతూ నడువు. నీ వెనకనే నేనూ నడుస్తాను" అన్నాడు రాజకుమారుడు.

తన పాచిక పారనందుకు రాక్షసుడు మనసులో విచారించాడు. అయినా చేసేది లేక అలాగే ముందు దారి చూపుతూ నడిచాడు. రాజకుమారుడు అతని వెనకనే కత్తి సిద్ధంగా పుచ్చుకుని నడుస్తున్నాడు. కాని రాక్షసుడు చాలా తొందరగా తిరగటంవల్ల రాజకుమారుడు అతనిని అందుకోలేకపోయాడు. అందువల్ల తను అనుకున్నట్లు రాక్షసుణ్ణి పొడవలేకపోయాడు. ఎలాగైతేనేం, ఆరోజుకి గండం గడిచి బ్రతికి బైటపడ్డాడు.

తర్వాత రాక్షసుడు రాజకుమారుణ్ణి అక్కడే వదిలేసి రాజకుమార్తెవున్న గదిలోకి వెళ్లిపోయాడు.

తెల్లవారేవరకూ రాజకుమారుడు అక్కడే ఆ చీకట్లోనే వుండిపోయాడు.

* * *

తెల్లవారింది. రాక్షసుడు మళ్లీ సన్యాసి వేషం వేసుకుని ఎక్కడికో వెళ్లిపోయాడు.

రాక్షసుడు వెళ్లిపోగానే, రాజకుమారుడు ఎకాయెకిని రాజకుమార్తె దగ్గిరికి వెళ్లి, ఆమె చెవిలో పువ్వు తీశాడు. ఆమె లేచి కూర్చుని, "ఏమి జరిగింది, రాత్రి?" అని అడిగింది.



"నీవు చెప్పినట్లే చేశాను కాని అతను చాల తొందరగా నడిచాడు. అందువల్ల నీ ఉపాయం ప్రకారం అతన్ని పొడవలేక పోయాను. ఎలాగైతేనేం, నీదయవల్ల బ్రతికాను. ఈసారి ఏంపని చెబుతాడో కనుక్కున్నావా?" అని అడిగాడు రాజకుమారుడు.

అప్పుడు రాజకుమార్తె యిలా చెప్పింది: —"సాయంత్రానికి అతను తిరిగివస్తాడు. రాగానే నిన్ను ఒక పెద్ద హాలులోకి తీసుకుపోతాడు. ఆ హాల్లో ఒక సింహాసనం వుంటుంది. అతను దానిమీద కూర్చుని నిన్ను తన పాదాలదగ్గిర వంగి మూడుసార్లు దణ్ణం పెట్టమంటాడు. అప్పుడు నువ్వు — 'అయ్యా, నేను గొప్పవంశాన పుట్టిన సంగతి మీకు తెలిసినదే కదా! ఈ రోజువరకూ ఆ వంగివంగి దణ్ణాలు పెట్టటమంటే ఏమిటో నేను యెరగను. మీరు కనుక అలా చేసి చూపెడితే తర్వాత నేను అలాగే చేస్తాను' అని చెప్పు. అతను చేసేదిలేక అలాగే మూడుసార్లు వంగి దణ్ణం పెడతాడు. ఆ మూడుసార్లలో మంచి సమయంచూసి నీ కత్తితో అతని తల నరికివెయ్యి" అని సలహా చెప్పింది రాజకుమార్తె. రాజకుమారుడు చాల



సంతోషించి పువ్వు ఆమె చెవిలో పెట్టి తను వెళ్లి మళ్లీ చీకటిగదిలో కూర్చున్నాడు.

సాయంత్రానికి రాక్షసుడు తిరిగి వచ్చాడు. రాజకుమారుణ్ణి తనవెంట ఒక పెద్దహాలులోకి తీసుకువెళ్లాడు. అక్కడ ఒక సింహాసనంవుంది. దాంట్లో రాక్షసుడు కూర్చుని రాజకుమారుణ్ణి తన పాదాల దగ్గిర వంగి మూడుసార్లు దణ్ణం పెట్టమన్నాడు. రాజకుమార్తె చెప్పిన సలహా ప్రకారం రాజకుమారుడు రాక్షసుణ్ణి మొదట దణ్ణంపెట్టి చూపమని అడిగాడు. రాక్షసుడు సరేనని మొదటిసారి వంగాడు. రాజకుమారుడు కత్తి సిద్ధంగా వుంచుకున్నాడు. రెండోసారి రాక్షసుడు వంగాడు. రాజకుమారుడు కత్తి రాక్షసుడి మెడపైకి ఎత్తి తయారుగా వుంచుకున్నాడు. మూడోసారి రాక్షసుడు వంగటం, రాజకుమారుడి కత్తి రాక్షసుడి తలనీ మొండాన్నీ వేరువేరుగా ఖండించటం ఒక్కసారిగాజరిగాయి.

ఈ పని పూర్తికాగానే రాజకుమారుడు సంతోషంతో రాజకుమార్తె గదికి ఒక్క పరుగున వెళ్లి, ఆమె చెవిలో పువ్వుతీసి లేపాడు. రాక్షసుణ్ణి చంపినందుకు రాజకుమార్తె రాజకుమారుణ్ణి చాల మెచ్చుకున్నది. అప్పుడు రాజకుమారుడు అడిగాడు—"ఇంతటితో మనకు వాడి పీడ వదిలినట్లేనా?" అని.

"అప్పుడే ఏమయింది. రాక్షసుణ్ణి నువ్వు చంపావన్నమాటేగాని అతని ప్రాణం వేరే యింకోచోట వుండనేవుంది. ఆ ప్రాణాన్ని కూడా చంపావంటే అప్పటికి రాక్షసుడు పూర్తిగా చచ్చినట్లు. లేకపోతే యింకో గంటలో అతను మళ్లీ బ్రతుకుతాడు" అని చెప్పింది రాజకుమార్తె.

"ఆ ప్రాణం ఎక్కడవుందో చెప్పరాదా. ఆ పనికూడా పూర్తిచేస్తాను" అని అడి

గాడు రాజకుమారుడు. అప్పుడు రాజకుమార్తె యిలా చెప్పింది:

"ఇప్పుడు రాక్షసుణ్ణి చంపిన హాలుకు ప్రక్కనే నీకు కొన్ని మెట్లు భూమిలోకి పోతూ కనిపిస్తవి. నివు ఆ మెట్లన్నీ దిగిపోవాలి. చాలా లోతుకుపోవాలి. అలా పోతూవుంటే దారిలో నీకు తొమ్మిదిగదులు ఒకదాని తర్వాత ఒకటి కనిపిస్తై. తొమ్మిదో గది దాటంగానే నీ దారికి ఒక గోడ అడ్డు తగులుతుంది. అప్పుడు నువ్వు నీ కత్తి కొనతో ఆ గోడమీద 'తోలిగిపో గోడా' అని మూడుసార్లు కొట్టు. మూడోసారి కొట్టగానే గోడ తొలిగి పోతుంది. అప్పుడు నీకెదురుగా ఒక గది కనిపిస్తుంది. ఆ గదిలో ఒకసింహాసనంమీద ఒక పదేళ్ళకుర్రవాడు కూర్చునివుంటాడు. అతనిచేతిలో ఒక గిన్నె వుంటుంది. ఆ గిన్నెనిండా ఒక ద్రావకం వుంటుంది. రాక్షసుడిప్రాణం ఆకుర్రవాడే. నీవు సరాసరి వెళ్లి ఆ కుర్రవాణ్ణి నీ కత్తితో పొడువు. ఆతడు చనిపోతాడు. దాంతో రాక్షసుడు చనిపోయిన ట్లవుతుంది. కుర్రవాణ్ణి చంపిన తర్వాత అతని చేతిలో వున్న గిన్నె నాదగ్గిరికి తీసుకురా. దాంట్లోవున్న ద్రావకం ఒక్కొక్క బొట్టు యిదివరకు రాక్షసుడి చేతిలో చనిపోయినవారి ప్రాణాలన్నమాట. అందుకని నువ్వు ఆ ద్రావకం ఒక్క బొట్టు



కూడా కింద పడనీయకుండా నా దగ్గిరికి తీసుకరావాలి."

రాజకుమారుడు వెంటనే మెట్లు దిగి వెళ్లాడు. రాజకుమార్తె చెప్పినట్లు తొమ్మిది గదులూ, దాని తర్వాత గోడ తగిలాయి. గోడమీద కత్తితోకొట్టగానే గోడ తొలిగిపోయి గది కనిపించింది. రాజకుమారుడు ఎకాఎకిని వెళ్లి గదిలో సింహాసనంమీద కూర్చున్న కుర్రవాడి గుండెల్లో ఒక్కపోటు పొడిచాడు. కత్తి వీపులోంచి దూసుకుపోయింది. కాని ఆ కుర్రవాడు మాత్రం అలాగే కొయ్యబారిపోయాడు.

తర్వాత రాజకుమారుడు ద్రావకం గిన్నె తీసుకుని రాజకుమార్తెని కలుసుకున్నాడు. రాజకుమార్తె సంతోషించింది.

తర్వాత ఆ ద్రావకం తీసుకుని రాజకుమార్తె రాజకుమారుణ్ణి వెంటబెట్టుకుని ఒక పెద్ద గదిలోకి తీసుకుపోయింది. అక్కడ రాక్షసుడిచేతిలో చనిపోయిన దురదృష్టవంతుల పీనుగలు వరుసగా ఉన్నై. అందులో పిల్లలున్నారు, పెద్దవాళ్లున్నారు, ఆడవాళ్లున్నారు. దాదాపు వెయ్యిపీనుగులు దాకా వున్నయ్. రాజకుమార్తె తనుతెచ్చిన ద్రావకం ఒక్కొక్క బొట్టే ఒక్కొక్క పీనుగమీద వేసింది. వెంటనే అందరూ వరసగా తిరిగి బ్రతికారు. వాళ్లు జరిగిన సంగతంతా తెలుసుకుని రాజకుమార్తెనీ, రాజకుమారుణ్ణీ ఎంతో మెచ్చుకున్నారు. తర్వాత, ఎవరిళ్లకు వాళ్లు చేరుకున్నారు.

రాజకుమార్తె రాజకుమారుణ్ణి తనతో పాటు తన తలిదండ్రుల దగ్గిరికి తీసుకుపోయి జరిగినదంతా చెప్పింది. వాళ్లు చాల సంతోషించారు. రాజకుమారుడి తలిదండ్రులకు కూడా కబురుచేసి పిలిపించారు. ఒక సుముహూర్తాన రాజకుమార్తెని రాజకుమారుడి కిచ్చి వైభవంగా పెళ్ళి చేశారు. తర్వాత రాజకుమారుడు, భార్యని తీసుకుని తన రాజ్యానికి వచ్చి వెయ్యేళ్లు సుఖంగా బ్రతికారు.

[అయిపోయింది]






ఒకవూళ్లో ఒక కాపు. ఆ కాపుదగ్గిర చాలా మేకలున్నాయి. ఆ మేకలతోపాటు కొన్ని గొఱ్ఱెలు కూడా వుండేవి. ఆ మేకలనీ, గొఱ్ఱెలనీ శ్రద్ధతోనూ ప్రేమతోనూ కాపాడుతున్నాడు కాపు. ప్రతిరోజూ వాటి నన్నిటినీ ఒకేసారి మేతకు తోలేవాడు.

తలలు పైకి ఎత్తిపెట్టుకొని బహు దర్జాగా సాగిపోయేవి మేకలన్నీ. గొఱ్ఱెలు మాత్రం తలలు వొంచుకొని మెల్లగా నడిచి పోయేవి. అవి వినయంగా ఉండటంచేత గొఱ్ఱెలంటే దర్జా తెలియని మూర్ఖజంతువులుగా ఎంచి, ఏవగించుకునేవి మేకలు.

'మేము బలవంతులం. మా బలగం పెద్దది. మేము తల పైకెత్తి ఠీవితో నడవగలం. ఈ గొఱ్ఱెలు చూడబోతే అట్టేలేవు. పైగా అవి అవమానంతో ఎప్పుడూ తల దించుకొనే వుంటాయి. ఈ గొఱ్ఱెలకూ మాకూ పోలిక యెక్కడ? మా మధ్యని దోస్తీ కుదరదు' అని అంటూండేవి మేకలు.

ఆహారం కావలసివస్తే మేకలు ఎత్తయిన పొదలనుండి ఆకులు తుంపేవి. అందకపోతే ఒక్కొక్కప్పుడు వెనకాళ్ళమీద నిల్చొని మరీ ఆకులు లాగి తినేవి. ఆ మొక్కలకు ముళ్లు వున్నా పౌరుషంకొద్దీ లక్ష్యపెట్టేవికావు మేకలు.

గొఱ్ఱెలకుమాత్రం ముళ్లు అంటే తగని అసహ్యం. అవి భూమిమీద దొరికే మెత్తటి పసిరిక మేసి అంతటితోనే తృప్తిపడేవి.

'గొఱ్ఱెలు ఎప్పుడూ తలలు వొంచుకొనే వుంటాయి. ఎప్పుడూ పచ్చిగడ్డిమాత్రమే పెరుక్కు తింటూవుంటాయి. మేము ఎంత ఎత్తున ఉన్నదానినయినా అందుకుని తినగలము. గొఱ్ఱెలకంటె గొప్పవాళ్లం మేము' అని బడాయికొట్టేవి మేకలు.

రచన: చెరుకుమూడి రాధాకృష్ణమూర్తి



ఒకరోజున కాపు గొఱ్ఱెలకుండే ఉన్ని నంతా కత్తిరించివేశాడు. పాపం అవి చాలా వికారంగా తయారయ్యాయి. ఇది చూచి మేకలు వాటిని మరీ అసహ్యించుకున్నాయి. 'మా బొచ్చును ఎవ్వరూ తాకరు. గొఱ్ఱెల వంటి మూర్ఖజంతువులు మాత్రమే తమ బొచ్చును పోగొట్టుకుంటాయి. గొఱ్ఱెలకంటే మే మెంతో హెచ్చు' అన్నాయి మేకలు.

ఇట్లా వుంటూండగా—

కాపుని చూడ్డానికి ఒకనాడు కసాయి వాడు వచ్చాడు. 'నీదగ్గిర మంచి గొఱ్ఱె లున్నాయి కదా. వాటిని నేను కొనుక్కుం టాను' అన్నాడు కసాయివాడు.

'ఉహుం వాటి నివ్వటానికి వీలులేదు. వాటిని ఎన్నటికీ అమ్మను. పాపం అవి నా కెంత వుపయోగకారు లనుకున్నావు! అవి లేకుంటే నాకొక్క నిమిషం గడవదు. అయినా, వాటి ఉన్ని అమ్ముకుని మేము జీవనం గడుపుతున్నామాయె. అదేమాకు వ్యవసాయం. కనుక్క గొఱ్ఱెలగురించిమాత్రం నీవు ఎటువంటి ఆశ పెట్టుకోవద్దు' అని కచ్చితంగా చెప్పివేశాడు.

'పోనీ మరి, మేకల్నిస్తావా?' అని అడి గాడు కసాయివాడు.

'అట్లానే, కొనుక్కుపో' అని అంగీకారం తెలిపాడు కాపు.

కసాయివాడు అడిగినంతడబ్బూ కాపుకి చెల్లించి మేకలను తోలుకుపోయాడు. అమాయికపుగొఱ్ఱెలు అట్లానే హాయిగా కాల క్షేపం చేస్తూ యజమాని దొడ్లో చిరకాలం ఉంటూవున్నయి. మిడిసిపడి కోతలుకోసే మేకల్ని కసుక్కున పీక కోసిపారవేశాడు కసాయివాడు.

అందుకనే, మనిషికయినా పశువుకైనా గర్వం కూడని గుణమనీ, వినయం గొడు గులా కాపాడుతుందనీ అంటారు పెద్దలు.





















అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పైన కనిపిస్తున్న బొమ్మలో ఆరు తలలూ ఒకేలాగున వున్నట్లున్నాయి కదూ? కాని అలా లేవు. రెండుతలలు కొంచెం తేడాగా ఉన్నయి. ఆ తేడా లేకపోతే ఆరు తలలూ ఒకేలాటివే. మరి, తేడాగా వున్న ఆ రెండుతలలూ ఏవో కనుక్కోండి.

కనుక్కోలేకపోతే జవాబుకు 54 పేజి చూడండి.

# ఆంధ్ర రాష్ట్రము

(దసరా గీతిక)

శ్రీలకెల్లను పుట్టినిల్లయి
శీలసంపద కాస్పదంబయి
మేలులొసగెడి తెనుగు సీమను
మేలుకొల్పుము సోదరా. 1

మూఁడుకోటుల తెలుగు బిడ్డలు
మోదమలరగ సంచరించుచు
వాడి మగటిమి జూపి తిరుగగ
వాదమేలర సోదరా. 2

పాడిపంటల కొదువ లేదూ
పైరు పచ్చల తరుగు లేదూ
పైడిపంటలె పండు నెలవులు
బాగుగా గను సోదరా. 3

కృష్ణ గోదావరి నదులు
తృష్ణదీరగ నమృత మొసగుచు
ఉష్ణతాపము వాప నాంధ్రులు
జిష్ణులైరిర సోదరా. 4

తుంగభద్రానదీ జలము
తుంగమై యాకసమునంటు త
రంగపంక్తుల తెనుగు నేలను
రంగుమీరెర సోదరా. 5

తూర్పునను రత్నాకరేంద్రుడు
ధూర్తులకు గంభీరుడై యతి
నేర్పుమీరగ తెలుగుతల్లిని
నెనరునను గను సోదరా. 6

విజయనగరం బుత్తరంబున
విజయనగరము దక్షిణంబున
విజయవాడయి మధ్య వెలసెను
విజయరాష్ట్రము సోదరా. 7

ఒక్కదిశ మన కరవ సోదరు
లొక్కదెస కన్నడ భ్రాతలు
నొక్కవైపున ఓఢ్ర యనుజులు
చక్కగా గను సోదరా. 8

ఇరుగు పొరుగు సహోదరాళిని
నెసక మెసగగ మైత్రితోడుత
కరముప్రేమను గాంచి రాష్ట్రపు
గౌరవము గను సోదరా. 9

తెలుగువీరుల శక్తిచిహ్నము
తెలుపుచున్నది విజయనగరము
తెలుగు కవులను రాజ్మహేంద్రమె
తెలుపుచున్నది సోదరా. 10

రచన:

## ధూళిపాళ వెంకటసుబ్రహ్మణ్యం

## జాస్తి వెంకటనరసయ్య

తిరుపతియు శ్రీశైలతీర్థము
స్థిరముగను భద్రాద్రిక్షేత్రము
లరయుగను మన తెనుగుసీమను
అలరుచుండెర సోదరా. 11

శిల్పకళలకు తెలుగుగడ్డయె
శ్రేష్ఠమైనది భారతావని
అల్పమే యది దేశదేశా
లాక్రమించెర సోదరా. 12

ఎల్లొరా అజంత గుహలలో
ఎంత పనితన మలరియున్నది ?
మెల్లగా నీవడిగి గనుగొని
మేలునొందుము సోదరా. 13

హంపియందున రాజసభలో
కంపమొందిన స్తంభరాజము
సొంపుగను సప్తస్వరమ్ముల
నింపుగూర్చును సోదరా. 14

దాక్షిణాత్యుల గానపటిమకు
దారి నొసగిన త్యాగరాయలు
సాక్షిరా మన తెనుగుగానపు
శక్తి తెలుపగ సోదరా. 15

కవితలో గానంబులోపల
ప్రవిమలంబగు భక్తిసంపద
వివిధకళల ప్రశస్తిగాంచిన
దవుర! కనుగొను సోదరా. 16

దేశభాషలయందు మిక్కిలి
తెలుగు లెస్సని మెప్పు వడసెను
దేశభాష తెనుంగుసీమను
తీర్చిదిద్దర సోదరా. 17

ఆంధ్రరాష్ట్రమునందు రాజ్యము
ఆంధ్రముననే నడుపుకొనరా
ఆంధ్రమే నీ కోర్టుభాషగ
అదరింపర సోదరా. 18

తెలుగువారలు కష్టసుఖములు
తెలుగులో అధికారులకును
తెలుపగలుగ స్వరాజ్య మదియగు
తెలిసికొనరా సోదరా. 19

ఆంధ్ర మంత్రులు ఆంధ్రనాయకు
లాంధ్రులెల్లను సర్వశుభముల
ఆంధ్రరాష్ట్రమునందు వెలయుత
అధిక జయముల సోదరా. 20

# చందమామ పజిల్

(భాషాభివృద్ధికి)

## ఆధారములు

### అడ్డము :

1. మన మూడు రంగుల జెండా
6. వాచుట
7. ధనుస్సు
8. కొంగ
10. స్త్రీ (బలములేనిది)
11. భూతము
12. మోము
14. రాక్షస చక్రవర్తి
16. ఒక పేకముక్క
18. పాలు, పెరుగు మొదలైనవివేడు.




### నిలువు :

1. ఒక ద్వీపము
2. మధురము
3. దీనిపై పిల్లలు వ్రాయుదురు
4. ఇతడు పద్యము లల్లును
5. ఇది గుచ్చుకుంటే బాధ
8. నత్తువ
9. సంతోషము
13. కడవెడైననేమి— పాలు
15. క్షణము
16. రోజులో ఒక భాగము
17. మర.

## చిక్కు మాట

(కూర్పు: మద్దాలి కోటేశ్వరరావు, పెదకొత్తపల్లి)

నేను నెల్లూరు జిల్లాలో నాలుగు అక్షరాల ఒక ఊరుని.

నాలో 1, 2 అక్షరాలు కలిపిచదివితే 'చూచి' అని అర్థం వస్తుంది.

3, 4, అక్షరాలు కలిపిచదివితే 'కొండ' అని అర్థం వస్తుంది.

1, 4, అక్షరాలు కలిపిచదివితో 'ఏనుగు' అని అర్థం వస్తుంది.

మరి, నేనెవరో కనుక్కోండి ?

మీరు కనుక్కోలేకపోతే జవాబుకు 54-వ పేజి చూడండి.

## వినోద చదరం

క్రిందవున్న చదరంలోని నాలుగుమాటలనూ, దిగువన యిచ్చిన ఆధారముల సహాయంతో పూర్తిచేసి చూడండి. మీరు చెయ్యలేకపోతే సరియైన జవాబుకు 54-వ పేజి చూడండి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రా | మ | | | |
| 2. | | రా | మ | | |
| 3. | | | రా | మ | |
| 4. | | | | రా | మ |

1. ఇది ప్రతిగ్రామంలోనూ ఉంటుంది.
2. జాబులురాసేముందు ఇట్లా ప్రారంభిస్తారు.
3. ఈలపాటలో పేరుగాంచిన నటుడు.
4. మహాత్ముడు ఇట్లాఅంటూప్రాణంవిడిచాడు.



## అబ్బాయిలూ, అమ్మాయిలూ!

పైన కనిపించే కొలను మధ్యని వున్న కమలందగ్గిరికి చేరుకోవటానికి ఒకే ఒక దారి వుంది. ఆ దారి ఏదో మీరు మొదటి ప్రయత్నంలోనే కనుక్కోండి చూద్దాం.

(ఈ చిక్కుబొమ్మని కూర్చి పంపినది: ఎ. శారద, మద్రాసు)

---

ముందు పేజీలోని చిక్కుమాటలకు జవాబులు:

అకారము; ప్రాకారము; వికారము; ఉపకారము; అపకారము; ప్రతీకారము; అహంకారము; సహకారము.

అబ్బాయిలూ! అమ్మాయిలూ !!

ఈ క్రిందివి అన్నీ "కారము"లే.

అవి ఏవో కనుక్కోండి

| | | |
|---|---|---|
| రూపము | — | కారము |
| గోడ | — | కారము |
| పైత్యకళ | — | కారము |
| మేలు | — — | కారము |
| కీడు | — — | కారము |
| సాధించుట | — — | కారము |
| కోపము | — — | కారము |
| చేదోడు | — — | కారము |

(మీరు కనుక్కోలేకపోతే జవాబులకు ప్రక్కపేజి చూడండి)

## వినోద చదరమునకు జవాబు

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రా | మ | మం | ది | రం |
| 2. | శ్రీ | రా | మ | జ | యం |
| 3. | ర | ఘు | రా | మ | య్య |
| 4. | హా | రా | మ | రా | మ |

52-వ పేజీలోని చిక్కుమాటకు జవాబు: 'కనిగిరి'

49-వ పేజీలోని చిక్కుబొమ్మలకు జవాబు: 2, 3, నెంబర్లుగల తలలు తేడాగా వున్నై.

# మామ

ఊగరా వుయ్యాల
ఊగరా పాపా...
ఊపు వూపున నీవు
ఊకొట్టుచును హాయి ॥ఊ॥

బంగారు వుయ్యాల
పాప తెచ్చితినయ్యా
భద్రంబుగా నందు
పవ్వళించుము తండ్రి ॥ఊ॥

ఊగేటి పాపాయి
ఊగొట్టు మరకనుల
ఊపుతూనే జోల
లొప్పుగా పాడెదను ॥ఊ॥

జోలపాటకు నీవు
జోగి నిదురోవోయి
చాటుగా నీ నిదుర
జాబిల్లి దిలకించు ॥ఊ॥

హాయి నీ నిదురలో
ఆనంద స్వప్నాలు
కని సంతసము జెంద
నే ముదము నొందెదను ॥ఊ॥

నీవు నా నేత్రాలు
నేను నీ చూపునోయ్
మన యిద్దరికి వొక్క
మామ చంద్రుడె దిక్కు ॥ఊ॥

రచన: 'సింహ'.

## ముగ్గులు



ఆర్. కల్యాణి, బందరు



యస్. జ్యోతికుమారి, కాకినాడ

## నే నెవరు?



పాపలూ! — ఈయ నెవరో మీకు తెలుసుకదూ?— 'నాపేరు మీ కెట్లా తెలిసిందీ' అని అడుగుతున్నాడా? 'నీ మొహమే చెబుతూందోయ్' అంటే సరి, ఇంక మాటాడడు. అయితే,— ఈయన్ని ఒక్కసారి తలకిందు చేసి చూడండీ, ఏమైపోతాడో!

### పజిలుకు జవాబు

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 జా | 2 తీ | య | 3 ప | తా | 4 క | 5 ము |
| 6 వా | పు | | ల | | 7 వి | ళ్లు |
| | | 8 బ | క | 9 ము | | |
| 10 అ | బ | ల | | 11 ద | య్య | ము |
| | | 12 ము | 13 ఖ | ము | | |
| 14 బ | 15 లి | | ర | | 16 జా | 17 కీ |
| 18 స | ప్త | స | ము | ద్ర | ము | లు |

Printed and Published by B.N. REDDI, at B. N. K. Press, 37, Acharappan Street, Madras

Editors: CHAKRAPANI and K. RAJA RAO.



*Chandamama, October 1948* *Drawn by: M. Gokhale*

పిల్లల కొలువు

CHANDAMAMA OCTOBER 1948 REGD. NO. M. 4854



చందమామ అందరికీ కావాలి

చందమామ కన్నడంలోనూ
అరవంలోనూకూడా వస్తున్నది

PRINTED AT THE B. N. K. PRESS, MADRAS-1